## విద్యామహాసభ — ఆంధ్ర మహాసభ తాటస్థ్యం

నిజాంరాష్ట్ర విద్యామహాసభ యొక్క ౧౦వ మహాసభ వరంగల్‌లో జరుగుతుందని. దాని ఆహ్వాన సంఘంలో బాధ్యతగల పదవుల్లో వరంగల్ ఆంధ్రమహాసభ కార్యకర్తలు ఉన్నా' ని తెలిసి చాలాఆశ్చర్యమైంది. ఇంతలో ఆంధ్ర మహాసభ కార్యకారిణీసమితికి ఒక సంస్థవారు, యీవిషయంగ్రాశారని, అందుపై కార్యకారిణి సమితి అది విద్యామహాసభ అయినందున కార్యకర్తలు చేరకూడదని ఆంక్షించుట అసమంజసము ని, చేరుట, చేరకపోవుట, వారిస్వేచ్ఛపై ఆధారపడినదని తీర్మానించినట్లు పత్రికా ముఖమున చూచాను.

విద్యామహాసభ పూర్వచరిత్రను. అవలోకిస్తే, అది హైదరాబాదుప్రజలకై ఏపాటి ఉపకరించింది తెలియకపోదు. పైగా దాని చర్యలవల్ల అది ప్రజాసంస్థగాదని, అందులో ధ్వనించేది ప్రజావాణిగాదని, నిరూపించడానికి, ప్రజాపక్ష విద్యామహాసభ యని మరొకసంస్థను లేవదీయవలసివచ్చినసంగతి అందరకు తెలిసిన విషయమే. అప్పటినుంచి నేటివరకు దాని ధోరణి. ఏమీ మారినట్లు తోచుటలేదు.

కాని, ఈతూరి సమావేశము వరంగల్లులోనట. ఆహ్వానసంఘంలో, అరంచవారు, మాదిరాజువారు, ఒద్దిరాజువారు, బహుశా పర్సావారు మొదలయిన ప్రముఖులు, ఆతీర్మానాలను, మీ ప్రజానాయకులు కూడా ఒప్పుకొనివారు. అని, అనిపించటానికి కాబోలు ఆహ్వాన సంఘంలో ఉన్నారు. ఇక ఆవిద్యామహాసభ, తద్వారా ఈ మహాపురుషులు ఏవిధంగా ప్రజలను తృప్తిపరుస్తారో చూడవలసిఉంది. ఆహ్వాన సంఘాధ్యక్షుడు, ప్రభుత్వంలోని ప్రతిచర్యను, వేయికంఠాలతో సమర్థించవలసిన ఇంతకన్న మరోమార్గం లేదని ప్రజలకు నచ్చజెప్పవలసిన సుబేదారుగారు. అధ్యక్షులు నేటివరకుగూడా అఖిలభారత ముస్లిం విద్యాసంఘానికి అధ్యక్షులై? ధనప్రాణాలను ధారపోస్తున్న, కమాలియార్ జంగుబహద్దరుగారు వీరిచేతులనుబట్టి ముస్లింజాతి వేరు. పాకిస్థాన్ గావాలె అనే వాదంలో లో ఎవరని స్పష్టమవుతున్నది. పైగా ప్రజాస్వామ్యవాదమే గిట్టని జాగీర్దార్లసంఘానికి బహు

## గణపతికి పట్టిన గతి

జిల్లా మహబూబునగరం పర్గీ తాలూకాలోని చప్రుదూరు అను గ్రామములో విఘ్నేశ్వరుని ఊరేగింపు చేయుటకై తహసీలులో విజ్ఞప్తిని గ్రామస్థులు ఇచ్చుకొనిరి. ఈ ఊరేగింపు క్రొత్తదిగా ఉన్నదనిన్నీ పూర్వంనుండీ లేని ఊరేగింపని రుజువుచేయగలిగితే సెలవిత్తుము లేకున్న సెలవుదొరకదుఅని తహసీలునుండి ఆజ్ఞ అయ్యెను. అందుపై విఘ్నేశ్వరునిపూజకు క్రొత్త పాత అనేది లేదు. ప్రతియింటివాడును వినాయకపూజ అయిన మరునాడు అవిగ్రహాన్ని భావిలోనో ఏటిలోనో ఉద్యాపనచేయుట హిందువుల ఆచారమైయున్నది. అందుకుగాను క్రొత్త పాత నిర్ణయమేమిటి? ఇట్లుండినను తహసీల్దారుగారు ఆజ్ఞ ఇయ్యకపోయిరి. గ్రామ భజన మందిరములోని విఘ్నేశ్వరునికి ఉద్యాపన ఇంతవరకు కాలేదు.

——

లా అధ్యక్షులు పైవిషయాలను అవలోకిస్తే విద్యామహాసభ ఏమిచేయుచున్నది తెలుస్తుంది.

ఇందులో, ముందుజరిగే తీర్మానాలు, ఆంధ్ర మహాసభ సూత్రాలకు వ్యతిరేకంగా జరిగితే ఈ ఆంధ్రనాయకులంతా దానికి బాధ్యులైతారా? కారా? అసలు ఆంధ్రమహాసభ దృష్టిలో, కార్యప్రణాళికలో, తెలుగుప్రజలకు కావలసిన విద్యకై ఏమైనా స్థానమున్నదా? హిందూ మహాసభ పాలసీని ముమ్ముందే ఊహించుకోగలిగిన ఆంధ్రనాయకులు, ఈవిద్యామహాసభ చేయబోవు తీర్మానాలను ఊహించుకోలేరా? ఎన్నదూలేని, మనమహాసభ కార్యకర్తలు, అందులో పాల్గొనుటవల్లజరిగే లాభాలకంటే నష్టాలు ఎక్కువగా ఉండవేమో? ఆలోచించవలసినవిషయం. లేదా. ఆంధ్రమహాసభ ప్రజలందరిని, బహిరంగా అందులో పాల్గొనమని ఆదేశించాలి, అప్పుడు ప్రజాప్రతినిధులు, మహాసభలో పాల్గొంటే జరిగే విషయాలు ఎట్లుండునో, మహాసభకు తెలుస్తుంది. ప్రజాప్రతినిధులు పాల్గొనే అవకాశాలు, ఆహ్వానసంఘంలో ఉండి, ఈ మహానీయులు చేయాలి. ఏది ఎట్లయినా, ఈవిషయంలో "ఎవరికివారే యమునాతీరే" యని వదలి. ఆంధ్రమహాసభ తనకు పట్టదని ఊరుకోటం బాగాలేదు.

కొండాటి నారాయణరావు.

## గద్వాల వార్తలు

ఆవిజ

——

ఈగ్రామం గద్వాల సంస్థానంలో చాలా గొప్పగ్రామం. పూర్వం ఇదే ముఖ్యపట్టణం ఈ ప్రాంతాన్నంతా ఇప్పటికీకూడ అవిజసీమ (శ్రీ స్నే అపభ్రంశంగా ఐజసీమ) అని అంటారు. ఈగ్రామంలో ౧౫౭౫ ఇండ్లున్నవి. అందుచేత చాలాగొప్పగ్రామం. ఇచ్చట పూర్వం టప్పా లేకుండెను. గ్రామస్థులుపోరాడగా ఒకపరీక్షార్థ పుటప్పా ఏర్పడింది. దాన్నికూడా అప్పుడే యెత్తివేస్తామంటున్నారు. క్రొత్తక్రొత్తలో ఆదాయం తక్కువగాఉంటుంది. కావున ఇంకా ౨ ఏండ్లపాటిఅయినా పరీక్షచేస్తే రైతులకు ఆధారంగాఉంటుంది. మా సంస్థానంవారున్నూ యీవిషయంలో శ్రద్ధ తీసుకోకుంటే రైతులకు ఇంకాఎవ్వరుగతి. కావున మా సంస్థానంవారు కూడా ఈటప్పాను ఖాయపరచుటకై పైకిప్రాసి సహాయ పడగలరని మనవి చేసుకొనుచున్నాము.

గ్రామరైతులు

## యక్షిణీదీప ప్రదర్శనము

రాయరావుపేట, ౧౫-౩-౫౦

మద్యపాననిరోధక కేంద్రసంఘ సహాయకార్యదర్శులగు శ్రీయుత వెల్దుర్తి మాణిక్యరావుగారు మద్యపాననిరోధక ప్రచారము మా ప్రార్థనస్వీకరించి యీ బహమన్ ౧౧వతేదీశనివారపు సాయంత్రము మేడిచల్ తాలూకాలోని మాగ్రామమునకు దయచేసిరి. రాత్రికి రాయరావుపేట, జనిగలపేటపౌరులద్వారా ఒకబహిరంగసభ జరుపబడెను. సభలో శ్రీమాణిక్యరావుగారు యక్షిణీదీపముద్వారా మద్యపానమువలన నష్టకష్టములు తాగుబోతుల దృశ్యములన్నీ సినిమా మాదిరి మాపెట్టి ప్రేక్షకుల నానందింపజేసిరి. యీరోజే మల్కాజిగిరి పోలీసు అమీనుగారుకూడ ఒకానొక కార్యార్థము మాగ్రామమునకు వచ్చియుండిరి. వారితగుపురస్థానిక పోలీసు దఫేదారు కూడవచ్చి సభలోపాల్గొనిరి. మాపౌరులప్రార్థన స్వీకరించి మాయీచిన్నపల్లెలపై దయగలిగి శ్రీయుత మాణిక్యరావుగారిని పంపినందులకు కేంద్రసంఘమువారికెంతయో కృతజ్ఞులము.

వి. యన్. దీనబంధు
కార్యదర్శి

## పంటలు సరిగాలేక రైతుల అవస్థ

(స్వ. వి.) బద్దారం. బహిమన్ ౧౨

మెదకుజిల్లాలోని అందోలు తాలూకాలోని బద్దారము అనుగ్రామమున సకాలమున వర్షములు కురియక చాలాభాగముభూమి పడావ ఉండెను, ఇంతలో మాఘకార్తిలో చెర్వులోనికి సేద్యము నకవసరమైన నీరువచ్చెను. పైకార్తిలో నీరువచ్చినసేద్యము చేసితీరవలయునను శాసనముండుటచే గిర్దావరు గారు సేద్యము చేయుకున్న పడావ దండుగలు పడునని తెలిపిరి. విధిలేకకాలముస్త్తిపోయినను పుబ్బకార్తిలోవిత్తబడెను. పైస్థలహీనమై అభివృద్ధినొందక క్షీణించి పంటఫలించదయ్యె. పంటలనష్టపడినవని సకాలమునకు పట్వారీద్వారా విజ్ఞప్తులు తహసీలుదారు గారి సన్నిధికంపుకోబడెను వారువిజయముచేసికొన్ని కిత్తాలను మాత్రముచూచి తమ గుడారం చేసుకొనిరి. ఈపంచనామా సందర్భమున ఒక్కనంబరైనను కోసి చూడరైరి. పంచులను ఎవ్వరిని నియమించలేదు. ఆచారప్రకారము పంచనామా తక్తాలు పంచుల అభిప్రాయయుక్తముసిద్ధపర్చి నివాసస్థలమునగల వారిపేర్లనువ్రాసిరి. వారైనను రైతులుకారు ఇతర గ్రామపుగ్రామోద్యోగులే, వీరైనాకిత్తాలను చూచినవారుకారు. తహసిల్‌దారుచూచిన కిత్తాలుతప్ప తక్కినవన్నియు నామంజూరే. నామంజూరు వార్తరైతులలో వ్యాపించెను. తక్షణమే రైతులుతిరిగి శ్రీతహసీలుదారుగారిని దర్శించి విజ్ఞప్తిద్వారా పంచనామాలలో న్యాయముదొరకలేదనియు పునర్విమర్శనగావించ వేడిరి. విజ్ఞప్తిని త్రోసిపుచ్చిరి. ఆపైనచేయునదిలేక రైతులు శ్రీదువ్వంతాలూకాదారు గారిని దర్శించి విజ్ఞప్తి ద్వారా శ్రీతహసిల్‌దారు గారివద్ద తమకు న్యాయము దొరకలేదనియు తాముయథార్థముకనుగొని న్యాయము ప్రసాదించ వలయునని వేడిరి. శ్రీదువ్వంతాలూకాదారు గారు గ్రామమునకువిజయముచేసిరి. గాని శ్రీతహసీల్‌దారు గారిపై అసంతృప్తికను పరచిరనిమండిపడుచు తలపుమాల్ నంబర్లపర్యవేక్షణ ప్రారంభించిరి. యథార్థముగ అన్నియు రెండుఅణాలులోపుపంటలేకున్నను,ఒక్కనంబరైనా కొంతభాగమైనా కోసిచూడరైరి. పంచులను నియమించి వారియభిప్రాయము అడుగు చుండిరి. పంజాలుప్రతిమాటకు తథాస్తు అనుచుండిరి. తుదకు ఏడ్పుతో కొన్ని మాఫీలు కొన్ని టికీమాడవవంగ పన్ను విధించిరి. మరి కొన్నికిత్తాలు శ్రీతహసిల్‌దారు గారుచూచిన వెంటనే మాఫీ అయినవని కొందరు కోసినవియుండెను. నామంజూరువార్త వినగానే వాటివికప్పులు వేసియుంచి యున్నవి" యుండెను. వీటిని చూడజాలమని పూర్తిపన్నువిధించిరి ఇట్టికిత్తాలపూర్తి మాఫీదొరకవలసినదైనను రైతులుపొరపాటు జరిగినందున తమతప్పిదము

## అమీను గారి ఘోరచర్య

(స్వ. వి)

ఖమ్మంతాలూకాలోచింతకాని పోలీసుసబ్ యిన్‌స్పెక్టరుగారు గోర్లవపహడుగ్రామమునకువెళ్లి అచట కిందన్లె మంగిడను హరిజనుడు వేరుసెనగ కాయదొంగిలినముచేశాడనుకేసును విచారణ చేయుటకు అతనిని నాకాలో నిలిపి పింధికట్టుబట్టపై బట్టు వూడితెరిక దింబరుని గాచేసి పురుషాంగము ను మూడింటిదిబట్టుకొని బలముకొద్ది లాగినాడట. దానివలన తనకే అంగముపాచిబుడ్డదిగి ప్రమాదస్థితికివచ్చినది. ఖమ్మంమెట్లిబాగు చేయించుకుందామని బయలుదేరితే అమీనుగారు నిరోధించినాడట సత్యంతెరముకేక ఆక్షేమంచములోపడి బాధఅనుభవించుచుండెను. పిదపకొందరుయువకుల ఆలోచనప్రకారము ఖమ్మంపెల్లి డాక్టర్ గారి వద్ద బాగుచేయించుకొనుచు ఉన్న తాధికారులకు విజ్ఞప్తులు పంపుచున్నారు. బుడ్డలు దొంగిలించినందుకు బుడ్డదిగుటయే సరియగు శిక్షయని అమీనుగారుతలిక్కించుకొన్నారో యేమో- విచారణయేమి జరుగునో ఆలాదిక్కు లేని దీనకేమి న్యాయం జరుగునో తెలియదు.

——

నుఒప్పుకొని వీటిపైవిధించిన పన్ను శ్రీతాహసిల్ దారు గారు నాల్గుఅణాలకంటె హెచ్చు పంటఫలించిందనియే నామంజూరు చేసి యున్నారు. కావున వీరిఅభిప్రాయప్రకారమైన) ముందు వత్సరమువరకు బాకీయుండా ఉంచుటకు వేడిరి" లాభములేకపోయెను.

## ఓరుగల్లుజిల్లా ద్వితీయ వార్షికసమావేశము

"ఆహ్వానసంఘము, మానుకోట"

మానుకోట (మహబూబాబాద) ప్రజలలో చైతన్యము కలిగించుటకును మరియు పౌరసత్వము ను వారికిగుర్తింపజేయు ముఖ్యోద్దేశముతో ఈ సంవత్సరము ద్వితీయాంధ్రజిల్లామహాసభ మాను కోటతాలూకాలో జరుపుటకై నిశ్చయించితిమి ఇంతేకాక జిల్లాసంఘమువారి అంగీకారమును కూడ బడయగల్గితిమి. కావున ౧౨ బహమన్ ౧౩౫౦ తేదిన వరంగల్లుజిల్లా ఆంధ్రజనసంఘకా ర్యనిర్వాహకసమావేశసందర్భమునసే ఆహ్వాన సంఘము నిర్మాణవిషయముపై సమాలోచనమొ నర్చి ఆహ్వానసంఘమును స్థాపించియున్నాము.

జిల్లాసభ ఎప్పటికొనుపరులసినది యింకను ని ర్ణయముచేయలేదు. పరిశీలానంతరం త్వరలోనే ప్రకటించగలము.

జరుగబోవు జిల్లాసంఘమునకు అధ్యక్షపదవి కి శ్రీమాదిరాజు రామకోటీశ్వరరావు గారును, శ్రీ పుర్చారంగరావుగారున్ను అభ్యర్థులుగాసూచింప బడినారు. తాలూకాసంఘములతో సంప్రదించు కొని అధ్యక్షునిఎన్నుకొని తెలిపినవిషల అధిక సంఖ్యాంగీకారమునసుసరించి అధ్యక్షులు నిర్ణ యింపబడుదురు. తదుపరి సభాసమావేశమునకై ప్రభుత్వమునుండి అనుమతిపొందుటకై ప్రయ త్నింపబడసియున్నది. కావున తాలూకాసంఘ ములు యీవిజ్ఞాపనమును అంగీకరించెదరుగాక.

జిల్లాసభకార్యక్రమనిర్వాహకమునకై సేవా దళముకావలసియున్నది. కావున సేవాభావము తో ప్రతిఫలమునుగోరక సేవాదళములోచేరి ప నిచేయదలచిన విద్యావంతులగుయువకులు, కార్య దర్శిపేర దరఖాస్తును పంపుకొనవలయును, ఇ ట్లాం వాలంటీర్లకు సభాసమావేశమునకు ౧౫ రో జులుపూర్వమే శిక్షణనొసగపడును. ప్రతివాలం టీరు ఒకజతసెక్కారు, పాపుషర్టు, గాంధికాప్ఫ్, తమస్వంతవ్యయములతో కుట్టించుకొనవల యును, వీరికి కార్యక్రమము జర్గురోజులలో ఉ చితభోజనమొసగబడును,

విరాళములు వసూలుచేయుటకై ఈక్రిందికా ర్యకర్తలు నిర్ణయింపబడినారు.

శ్రీ కొమరగిరి నారాయణరావుగారు
అప్పె వేంకటరాజయ్యగారు
డా-వి_గోపాలరావుగారు
భువనగిరి నారాయణగుప్తగారు,

కావున దేశీయులు కార్యకర్తలు తమవద్దికి వచ్చినప్పుడు ఆంధ్రజనసంఘమందు సభ్యులుగా చేరి జిల్లాసభాసమావేశమునకగు వ్యయములకై భూరివిరాళములనొసంగి సన్మానింతురని ప్రా ర్థించుచున్నాము,

ఆహ్వానసంఘ సభ్యతరుసుము రు 3 నిర్ణయిం పబడినది. కావునసభ్యులు కాగోరువారు తమస భ్యత్వరుసుము కార్యాలయమునకు పోస్టుద్వా రాపంపవలయును. ఉద్యమముపట్ల అభిమానము వల్ల సభావ్యయములకై సహాయముచేయదలచిన వారు తమవిరాళములను మాకార్యాలయమున కు పంపించుటకు ప్రార్థితులు.

ఈజిల్లాసభాసమావేశసమయమున వరంగలు జిల్లా మహిళాజన సమావేశముకుగూడ జరిపిం చి స్త్రీల కొన్నత్యమునకై అవకాశము కలిపిం చదలచినాము, కావునవిద్యావంతులగు మహి ళామణులు ఇట్లుజరుపదలచిరేని ముందుగా ఆ హ్వానసంఘమునకు తెలుపుకొన్నచో కార్యక్రమ మునందు తప్పక అవకాశమీయబడును.

ఇట్లు
కొ. . రాయణరావు, కార్యదర్శి
అప్పె వేంకటరాజయ్య, సం॥ కార్యదర్శి

## వైదికధర్మము అనాదిది

పండిత అవధ్ బెహారిలాల్ ఎం. యస్. సి. గారి సమాధానము

(స్వ. వి.)

సూర్యాపేట, డిసంబరు ౧౬

౧౨ డిసంబరు క్రీ.శ. ౧౯౪౦ గురువారంప గలు 3 గంటలకు మిర్యాలగూడెమునుండి పం డిత అవధ్ బెహారిలాలుగారు ఇక్కడికి వచ్చినా రు. వారికి ౨౦౦ స్థానికప్రజలు స్వాగతమొ సర్చిపోటోతీసినారు. బస్సుస్టేషనుండి సమాజ భవనమువరకు వైదిక్ ధర్మకీజై, పండిత అవధ్ బె హారిలాల్ మహారాజుకీజై మొదలగు హర్షధ్వనుల తో, తీసుకవెళ్ళినారు. వీరు బెహారుకాపురస్తు లు. బెంగాలులో ప్లీడరుగపనిచేసినమహాయోగ్య విద్యావంతుడు. దేశసేవ చేయుతలంచినవారై సార్వదేశికసభ (ఢిల్లి)నుండి మనరాష్ట్రమునకు ప్రచారకులుగావచ్చి ప్రప్రథమమున కేశవమె మోర్యల్ హైస్కూలు (హైదరాబాదు) హెడ్ మాస్టరుగ 3 నెలలకొరకు నియమింపబడిన మహా పురుషుడు.

రాత్రి ౭౪ గంటలకు ప్రార్థనానంతరము ఇట్లుపన్యసించిరి. "మహర్షి దయానందు గారు ప్రథమమున బొంబాయినగరములో ౧౮౭౫ క్రీ. శ. ములో ఆర్యసమాజమును స్థాపించినారు, మ హర్షిదయానందు గారు ఈసాయి, మహమ్మదీ య, జైనమతములస్థాపించిన మహాత్మ యేసుక్రీ స్తు హజరతు మహమ్మదువలె స్వయంస్థాపకులు (బాని)గాక సృష్ట్యాదినుండినదు. బదుమున్న వై దికధర్మమునసుసరించుటని చాటుచున్న పునరుద్ధా రకుడు. ఈశ్వరుడుసృష్టించిన పాతాళలోక మును కొలంబసు ౧౪౯౨ క్రీ.శ. కనిపెట్టి ప్ర పంచమానవులకు పరిచయము కలిగించినట్లు ఈ శ్వరుడిచ్చినవేదజ్ఞానము మహర్షి గారుపునఃప్రజల లో ప్రచారమొనర్చినారు.

ఈభూగోళమునంతేయు పూర్వముఆర్యుల చే పరిపాలింపబడినదని మనభారతమువలన తెలి యుచున్నది. మహాభారతయుద్ధములో మహా రాజా బభ్రువాహనుడు (అమెరికా) మహారా జా షై(ఈరాన్) మహారాజాభగదత్తు (చీన్ నుండి సహాయముచేసినారు.

అర్జునుడు భారతయుద్ధములో మొదలుభీష్మ ద్రోణాచార్యులెదుట యుద్ధముచేయనని నిరాక రించినందులకు శ్రీకృష్ణభగవానుడిట్లు వచించిరి "యుద్ధములో వెనుదీయుట క్షత్రియధర్మముకా దు, ఇదికేవలము అనార్యుల (రాక్షసుల) లక్ష ణము" శ్రీరామచంద్ర భగవానుడు తండ్రిఆజ్ఞను నెరవేర్చుటకై అరణ్యమువెళ్లియుండెను. భరతు డు శ్రీరాములవారిని మర్ల్లి పీఠాధిపతులుగాచే యుటకై రామునికడకేగినప్పుడు మొదలు శ్రీరా ముడు, ప్రజాక్షేమాభిలాషి యగుటచే యిట్లుపరి శ్నించిరి. "మన రాజ్యములోనుండు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రాదిఆర్యులు కుశలముగా నున్నారా? యని అడిగినట్లు రామాయణములో కలదు.

ప్రపంచములో కృూరరాక్షసుడని ప్రఖ్యాతి చెందిన రావణుడు బ్రాహ్మణుడని, వాల్మీకి శూ ద్రుడని, మరియు విశ్వామిత్రుడు వైశ్యుడనివింటి యు ఈజన్మతో బ్రాహ్మణశూద్రులని యూ హించుట ఎంతతెలివితక్కువపనియో గుర్తించు డు" ప్రార్థించిరి. ఇట్లు ౧౪ (ఒకగంటన్నర) ఉపన్యసించిరి.

౧౩, ౧౪, తేదులలో ప్రజలకోరికపై ఆగిరి. ప్రపంచములోని ౧౯, ౨౦ శతాబ్దపు నాగరికత మరియు ఇప్పటినాగరికతను ప్రజలెదుట విపుల ముగతెల్లడించివారినందరి (ప్రేక్షకులను) ని అ జ్ఞానాంధకారమునుండి జాగ్రతపరచినారు.

౧౬—౧౨—౪౦ సోమవారం పగలు ౧౨గం టలకు స్థానికపండిత హనుమంతరావు సిద్ధాంతి రత్నగారితో ఖమ్మంవెళ్ళినారు.

ఈవారి 3 గంటలకు స్వామి విజ్ఞానానందు గారువచ్చినారు. వీరు మహాత్యాగపురుషులు. దక్షిణఆఫ్రికసమీపమున మదగాస్కర్ ద్వీపము వద్దనున్న మారిషస్ద్వీపములో ౬ సంవత్సరము లు ప్రచారముచేసి, "ఆర్యపత్రిక" అను పత్రికను నడుపుచు ౧౨౦ సమాజములు స్థాపన చేసిన యోగ్యదేవత.

(ఒకవిలేఖరి)

ఈ గ్రామమునకు ౧౧-౩-౪౦నాడు స్వామి విజ్ఞానానందగారు విచ్చేసి స్థానికమందిరము లో రెండుదినములుహిందీలోఉపన్యసించి ప్రే క్షకులను ఆనందపరచిరి మరియు స్వాములవా రు ౨౦మంది స్థానికయువకులకు యజ్ఞోపవీతధా రణగావించేసిరి. ౧౩_౩-౪౦నాడు సూర్యాపే టకు వెళ్ళిపోయిరి.

## ఊరపిచ్చుకలపై బ్రహ్మాస్త్రము

(స్వ. వి.)

ఖమ్మంమెట్టు హైస్కూల్ విద్యార్థులు అర్థసం వత్సరపరీక్షలుఅయిన ఒకటిరెండుదినాలతదుపరి వారిలోకొందరువిద్యార్థులు చివరిగంటలో తమత రగతులందులేకుండిరని హెడ్ మాస్టరు గారు (మూ ర్ఖనోపాధ్యాయులు) వారి పేర్లనుకొట్టివేసిరెం డంతలజీతములిచ్చుకుంటే మళ్లీతరగతులలో చే ర్చుకొందువన్నారట, పిల్లలుదీనినిభరించలేకహిం దూమహమ్మదీయులు కలిసి ఒకదినంసమ్మెకట్టిను రుసటిదినం బడికెళ్ళిరి. ఒకదినంసమ్మెకే బడిపి ల్లలనందరిని క్షమాపణకోరుమనగా క్షమాపణ పత్రములు మూర్ఖనోపాధ్యాయులవారి ఇష్టప్ర కారము వ్రాసియిచ్చిరి అయినను మహమ్మదీయ పిల్లలలో నల్గురిపేర్లుకొట్టివేసి, పాఠశాలపావులో జూరాన్ననాలపరాధంమోపి ఇంకొకపాఠశాలయం దు చేరవచ్చుననిరి.హిందూవిద్యార్థులలో 8 రిని ఏపాఠశాలలోకూడా చేరకూడదని శాసించిన ట్లు తెలియుచున్నది. క్షమాపణ కోరినవిద్యార్థు లయందు ఇంతనిర్దయయేమొకో? మరియు యీ మతవిచక్షణకూడా ఏ శాసనాధారాన్నిపట్టి చేసి నారో తెలియదు కావున ఉన్నతాధికారులైన వారు ఈవిషయాన్నివిచారించి యీబీదవిద్యార్థు లపై కనికరింతురని ప్రార్థన.

## మధిరతాలూకా ఆంధ్రజన సంఘప్రచారము

మధిర, డిసంబరు ౧౫

జంలాపురపు కేశవరావుగారును వారితనుచ రులు అయిదుగురును పల్లెపల్లెతిరిగి వేయిమందిస భ్యులనుచేర్చిరి ప్రతియూరుతిరుగునపుడు వారివా రికష్టములన్నియు నివేదింపబడెను యొకయూరి నుంచి నింకొకయూరికిబోవుటకు బాటలులేక యు నందినీరుదైన్యతాగుటకు గ్రామమునుంచి వక మైలునకువెళ్లినీరుతాగుటయు కొన్నిగ్రామము లవిత్తనములైనవేయుటకు వీలులేకపోవుటయు ఏగ్రామమందైనను పాఠశాలలులేకపోవుటయు, మతేరియాజ్వరములనిపడుభాగలను గుర్తింపబ డెను. వారికిసహకారముచేయుటకు ప్రభుత్వము వారు ముందడుగువేయుదురని కోరుచున్నాను ప్రచారముచేయునపుడు అడవులదాటుటకు భయ కంపితులై పెద్దపులులగాండ్రింపులకు సహితముజె సుకంజవేయక ప్రచారముచేసినందుకు ధన్యవాద ములువారికినర్పింపబడెను. ప్రతితాలూకాయందు ను ప్రచారముచేయకోరుచున్నాను, కనీసము ఆ యదువేలసభ్యులనైనచేర్చని తాలూకాకెనుకబ డువనితలంచి ఉత్సాహపూరితులగు యువకులను మనవిచేయుటఏమనగా మీమీకష్టములు నెరవే ర్చుటకు ఆంధ్రమహాసభ ప్రయత్నించునుగాన త్వ రలోపైసభ్యులచేర్చి మహాసభసమావేశములోప ల మీతాలూకాంతక్షేమగల ఆంధ్రభూమిని లేజో వంతముచేయగలరని ప్రార్థించుచున్నా.

ఇట్లు,
మిరియాల నారాయణగుప్త.

## పగటి దొంగతనము

(ఒక విలేఖరి) బహిమన్, ౧౭

రామగిరి (నల్లగొండ)లో ఎక్కువసంఖ్య సర్కారీఉద్యోగస్థులదే యున్నది—అందుకొందరు కటుంబయుక్తముగ లేరు, వీరలుఉదయముగ౧౦గంటలకు తమతమ యిండ్లకు తాళములువేసి కచ్చేరికి వెళ్లి సాయంత్రము ౫గంటలకు తిరిగియిల్లుచేరెడి వారలు.

అయితే వింతయేమనగా గతనెల జీతములు తీసుకొని కొందరు తమతమ యిండ్లలో భద్రపరచి కచ్చేరీకివెళ్లిరట. వీరి దురదృష్టమువలననే యీ మధ్యనపగటిదొంగతనము మొదలయి, కొందరియిండ్లలో కొన్నిరూపాయిలు తస్కరించబడినవి పాపమువారలు ఈసంగతిని ఆమీను కచ్చేరీవారలకు ఎన్నియోసారులు మనవి చేసిరి, చివరకుమొన్న మధ్యాహ్నము ౪గంటలకు ఒకరి యింటిలోదొంగతనముచేసిదొంగలు గోడమునికి పోవుచుండగాఖుఫ్యాపోలీసులు యిద్దరు పట్టుకొని ఆమీనుకచ్చేరిలో వారిని ఒప్పగించి ప్రజలకు మేలుచేసిరి.

---

## భువనగిరి

### లక్ష్మీనృసింహస్వామియాత్ర

[స్వ.వి.] ౧౨ బహిమన్ ౧౩౫౦ ఫ.

ఇక్కడికి సుమారు ౧౦ మైళ్ళదూరమునందు ప్రసిద్ధిచెందిన శ్రీలక్ష్మీ నృసింహస్వామి ఆలయముకలదు ప్రతిసంవత్సరము మార్గశిర శు ౧౪ నుండి వారముదినాలవరకు ఉత్సవము అతివైభవముగాజరిగెను వాడుకప్రకారము ఉత్సవము శు ౭ మంగళవారము రాత్రినుండి పుష్పవిమానరథోత్సవము బుధవారము ఉదయమువరకు జరిగెను. ప్రేక్షకులసంఖ్య సుమారు ౧౦ పదివేలు గతసంవత్సరము (హైదరాబాదు) నగరమునుండి సేవాసంఘమువారువచ్చి స్త్రీ పురుషులకు ప్రత్యేకవసతులు కల్పించియుండిరి. ఈసంవత్సరము పైసంఘమువారు రానందున దుండగీండ్లదుండగములుజరుగును. పైసంఘమువారు ఎందుకురాలేదో కారణము తెలియదు జూదరుల జూదము [గుండుఆటలు]వకు ప్రభుత్వవారుసెలవుఇవ్వనందున పల్లెటూరి అమాయక ప్రజలద్రవ్యము దుర్వ్యయముచేయబడలేదు.

ప్రభుత్వమువారిచే ఒకవస్తుప్రదర్శనశాలలో [జె.ఆర్.అండు బ్రుష్, ఆలేరు] ఇత్తడిపాత్రలు [పెంబర్తి] ఖాదివస్త్రములు (భువనగిరి) వారలచే ప్రదర్శనశాలలో ఏర్పాటుచేయబడెను.

ప్రభుత్వ వ్యవసాయశాఖవారి వివిధవస్తువులు, పలురకముల ధాన్యములు, వ్యవసాయకులకు [రైతులకు] ఏర్పాటుచేయబడెను.

---

## నగలకై హత్య

(ఒకవిలేఖరి) మెదక్, ౧౯-౩-౧౩౫౦ ఫ

గాజీపురం (పంబాగుల)గ్రామము చించోలి తాలూకాలోకలదు. ఇక్కడ వారంరోజులు ముందు ఎవరో అంతమ్మఅనుపెద్దముసలిని కరుకపిసికిచంపి నగలు, రూపాయిలు అపహరించుకపోయినారు పశువులమొరనువిని గ్రామస్థులుద్వారము తెరచిచూడగ పశువులు మేతనీళ్ళులేక అల్లాడుచుండెను ఇంట్లో శవము దుర్వాసనతోపడి యుండెను. మెదక్ నుండి పోలీసువారువచ్చి పంచనామాచేసి నిందితుల జాడతీయుచున్నారు. ఇంతవరకు నిందితులు పట్టుబడలేదు.

### జూదము

విఖారాబాదుకు నాలుగుమైళ్ళపైన అనంతగిరికొండ కలదు. అక్కడ ప్రతిసంవత్సరప్రకారం శ్రీ అనంతస్వామివారికి కార్తీకశు౧౫ నాడు రథోత్సవం జరిగెను. యాత్రికులు వేలకొలది వచ్చియుండిరి. సత్రములులేనందున జనులకు చాలకష్టము సంభవించెను. జాత్రలో కొన్ని మూడాసల (జూదం) ఆటలనుండి చాలమంది రూపాయిలు పోగొట్టుకొనినారు. యాత్రికుల స్నానపుయేర్పాట్లు గుండములో బొత్తిగాలేకుండెను స్త్రీలకు గుండములో స్నానపుయేర్పాట్లు అవశ్యంచేయవలసి యుండెను.

### దేవాలయ నిర్మాణం

చించోలి తాలూకాలోనే కోవగామ్రగ్రామం పెద్ద ఎక్కు రెండుమైళ్ళపైనగలదు. లోగడ పత్రికలో దేవాలయ రా॥ యెల్లారెడ్డి పటేల్ గారి స్వంత వ్యయముతో కట్టబడుచున్నదని వ్రాయబడియుండెను. ప్రతియేకాదశి వందలకొలదిజనులు యితర గ్రామాలనుండి వచ్చుచున్నారు. దీనినుండి కొందరుప్రజలు మద్యపానమును వదలుచున్నారు. పండరిపురము నుండి మొన్న రాతివిగ్రహములు రెండు తెచ్చినారు, యింకా స్థాపనకాలేదు.

---

## పర్భనీజిల్లా హిందూ మహాసభ

హిందూమహాసభవారిట్లు తెలుపుచున్నారు. పర్భనిలో ౬ ౭ ఫిబ్రవరితేదులలో జిల్లాహిందూమహాసభ జరుగును. పాటిల్ వకీలుగారు అధ్యక్షులుగా ఎన్నుకొనబడినారు. మహాసభకు సెలవుకొరకై ప్రభుత్వాధికారులకు తెలుపుకొనైనది.

---

## ఖమ్మం

### నాయకుల ఆగమనము

(స్వ.వి. ౧౩-౩-౫౦ ఫ.

౧౦-౩-౫౦ తేదీన ఎక్స్ప్రెస్ లో శ్రీయుత కాశీనాథరావు వైద్యాగారును శ్రీ శ్యామలాల్ గనోర్వాలా గారు శ్రీ రావినారాయణరెడ్డిగారును ఖమ్మంమెట్టు దయచేసిరి పురవాసులువారిని ఆహ్వానించి యేర్పరచిన విడిదిగృహముకు తీసుకొనివెళ్ళిరి, తరువాత, ౯½ గంటలకు పురములో యున్న గ్రంథాలయములు, హరిజనపాఠశాలలు సందర్శించిరి, మార్గమధ్యములో సాలీలగృహములకువెళ్లివారలయొక్క దినచర్య, ఆదాయవ్యయములపరిశీలించి, జాగీరు, ఖాల్సామగ్గములసంఖ్య దాదాపు (౧౦౦ వున్నవనియు, ఇండ్లు (౨౦౦) వున్నవనియు తెలుసుకొనిరి. హరిజనవాడలో వారలకు మద్యపానముత్రాగకూడదనియు, విద్య నేర్చుకొనుటచాలాముఖ్యమనియు, అందరియెడల ప్రేమతో ఉండవలసినదనియు, ప్రబోధించి స్కూలును సందర్శించి బసకుదయచేసిరి పగలు ౨-౩౦ ల సమయమున పురవాసులతోముచ్చటించిరి. దానిలోసెలవిచ్చినదేమనగా హిందూ మహమ్మదీయసఖ్యతచాలాఆవసరమనియు మనము దినదినము పిరికిపందలమై నిర్వీర్యులమై, చాలకావివారలముగా యుండకూడదనియు, మనకష్టనిష్ఠూరములు మనమేయెరుగకొనుట చాలాముఖ్యమనియు, యెప్పటికిఇతరులసహాయత కోరకుండాయుండవలయునని యు యెప్పుడుధైర్యముతో మనకాళ్ళమనము నిలిచెదమో అప్పుడుమనందరికిని సౌఖ్యముచేకూరుననియు, ఖద్దరునుధరించుట నీచముకాదనియు సర్కారువారే దానిని ప్రోత్సాహించుచున్నారనియుసెలవిచ్చిరి ౪ గంటలకు నేలకొండపల్లి గ్రామమువెళ్ళి తిరిగి రాత్రికివచ్చిరి, ఉదయము ఎక్స్ప్రెస్ లో మధిర తాలూకాకు వెళ్ళిరి.

### ఆంధ్రబాలికా పాఠశాల

ఈపురములో ఇదివరకు ఆంధ్రబాలికాపాఠశాలయేర్పరుపబడి (౧౦౮) మంది బాలికలతో ఈరోజువరకు కార్యక్రమముసక్రమపద్ధతితో జరుపబడుతూ పాతపేటలోయుండెను. అట్టిపాఠశాలశాఖఅవసరమనితలంచి కొత్తపేటపురవాసులు బహుఆదుర్దాతో విరామముగొనకనే శాఖ యునని అభిలషించినందున కార్యానిర్వాహకవర్గమువారును, సభలోయున్న పురవాసులును ఆమోదించి ౬-౩-౫౦ తేదిఉదయము ౯½ గంటలకు శ్రీ నోముల లక్ష్మీనర్సు బంగళాప్రక్కన శ్రీ మద్ది పిచ్చయ్యగారిచే మూడుసెలలమాత్రమేఉచితముఇవ్వబడిన దానిలోగణపతిపూజతో ప్రారంభింపబడియెను. ఈతీరుగ ఆంధ్రబాలికాపాఠశాల [౫] ఉపాధ్యాయినులతోను (౧౪౦) మంది బాలికలతో దినదినమువృద్ధిపొందుగాక అని ప్రార్థించుచున్నాము. ఇదివరలోయున్న కార్యనిర్వాహకవర్గములోతమపదవులకు రాజీనామాఇచ్చినందున అట్టిపదవులపైన శ్రీ నాచేపల్లి జేజయ్యగారిని ఉపాధ్యక్షులుగను, శ్రీ గురులింగం గారిని కోశాధ్యక్షులుగను యేర్పరుచుకొని రాజీనామాలిచ్చిన శ్రీ స. రామక్రిష్ణయ్యగారిని శ్రీరాయడి రంగయ్యగారికార్యనిర్వాహక సభ్యులనుగాయేర్పరుచుకొనియున్నారు.

### మందుపెట్టిన దోసకాయలు

ఈ పురములో ౧౬-౩-౫౦ తేదీన కంచుహరి ముత్తిగాడుఅను పంచముడుదొడ్డిలో మేయుచుండుచున్న పోతుకు దోసకాయలలోమందుపెట్టి దానిముందరగోడమీదినుండి పారవేసెను అట్టిపనిని ఇద్దరు నమ్మకమైనమనుజులుచూచిపట్టుకొని శ్రీ వేమునూరి రామకిషన్ రావువకీలుగారికి అందజేసిరి. వారుఆముదును శ్రీ ముఖమునపోలీసు స్టేషనుదార్గదగ్గరికిపంపిరి. ఇట్టివిఈవూరిలో దాదాపుపదుల లెక్కలోయున్నవి.

---

## సంగీత పరిషత్తు

### వరంగల్లు రేడియో స్టేషనుగూర్చి తీర్మానము

౧౩౫౦ ఫ, బహిమన్

శ్రీయాదగిరి సంస్థానములో ౧౨, ౧౩, ౫౦ ఫ. తారీఖులలో సంగీతపరిషత్తు సమావేశమైనది,

ఆసమావేశమునకు గౌరవాధ్యక్షులుగా సహస్రావధాని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారును, ఉపాధ్యక్షులుగ విద్వాన్ పాపట్లపానుమశాస్త్రిగారును, కార్యదర్శిగ వైణికశిఖామణి పండితములుశివానందశాస్త్రిగారును ౨౦మంది సాధారణసభ్యులును, నియమింపబడిరి.

### తీర్మానములు

ఈ క్రింది తీర్మానములు ఆమోదింపబడినవి:—

౧ శ్రీశ్రీశ్రీ మహాఘనతవహించిన శ్రీ నైజాంప్రభువరేణ్యులకు శ్రీలక్ష్మీనృసింహస్వామివారు దీర్ఘాయురారోగ్య వైభవములనొసంగ నిరంతరమును యీ సభవారు ప్రార్థించుచున్నారు.

౨. ఈపరిషత్సభ్యులు ప్రపంచానందముకొరకు ఆంధ్రులలోని ముఖ్యులు సంగీత విద్వాంసుల సామర్థ్యమును రేడియోప్రసారము ద్వారా లోకమునకు వెల్లడించుటకు రేడియోఅధికారమువారిని కోరుచున్నారు,

౩. వరంగల్ లో మంజూరుకాబడిన రేడియో స్టేషన్ ప్రత్యేకంతెనుగునకు నిర్మించుటకు త్వరసేయ గలందులకు ప్రభుత్వమువారిని యీపరిషత్తువారు కోరుచున్నారు.

---

## సిరిసిల్ల తాలూకాలో రైతులయాత్రలు

(స్వ.వి.)

సిరిసిల్ల, ౧౧-౩-౧౩౫౦ ఫ

౧౧-౩-౫౦ ఫ నాడు అవ్వల్ తాలుకుదారు సిరిసిల్లకు రానున్నారని తెలియగనే చుట్టుపట్టు గ్రామాదులరైతు ౫౦౦ మందివచ్చి కిస్తుబరాయింకమాఫీదరఖాస్తులు పెట్టుకొనిరి. అవ్వల్ తాలుకుదారు గారు దరఖాస్తుపై టికెట్టుమనిరి. రైతులుచాలాఆశతో ఆతురతతో మాఫీదొరకునని టికెట్లుపెట్టిరి. దరఖాస్తు నాంఋంజూరుచేయుచు, ఈఏడుమంచిపంటలుపండినవి మాఫీదొరకదనిచెప్పిరి రైతులువిలవిలమూడి ఏడ్చుచు, మాకేమిగతి యని వెళ్ళిపోయిరి.

౧౨-౩-౫౦ ఫ. నాడు, జెగ్గారావుపల్లి, మద్దిమ్యాల, బేలాయపల్లె, గోపాలపురము, ఆక్కపురము మొదలగుగ్రామాదుల రైతులు దరఖాస్తు కిస్తుమాఫీకొరకుయిచ్చిరి యథాప్రకారముగా మంజూరుచేయుటకుకాబోలు దరఖాస్తుపై టికెటు పెట్టించుకొనిరి. రైతులుమహాఆశతో టికెటుపెట్టిరి, తాలుకుదారుగారు దరఖాస్తునుబుట్టదాఖల్ చేసిరి. మొదలేమాఫీయివ్వను, దరఖాస్తువద్దన్నబీదరైతులకు అర్ధరూపాయిమిగిలేది. కాని శ్రీవారు రైతులబీదస్థితినెరిగికూడ ఇట్లుచేయుటఉచితము రైతులు హైదరాబాదు ప్రయాణము నిశ్చయించిరి.

వాస్తవముగ ఈసంవత్సరము పంటలన్నియు చెడిపోయినవి. ఏడుదినములు ఎడతెగనిమునుగుకురియుటచే పునాసలుపాడైనవి, మఘకార్తె తర్వాత వర్షింనందున మాగాణివివిధవ్యాధులకు గురియై నాల్గవవంతుకూడ పండలేదు. స్వయముగావెళ్ళి సిరిసిల్లతాలుకలోని ప్రతిగ్రామము తిరిగిచూచితిని. ఎచ్చటనైనఒకబీదవాని యొక్క రైతుబిడ్డనైనందువల్ల బీదరైతుయొక్క నిజస్థితిని కనుగొని పత్రికద్వారలోకమునకు తెలుపుచున్నాము. గతవత్సరముకంటె ఈఏడుచాలతక్కువపంట. దయామయులగు ప్రభుత్వమువారు గతవత్సరముకంటె ఎక్కువకట్టుదిట్టములుచేయుదురని గట్టిగానమ్ముచున్నాము. గతవత్సర బకాయిండ మాఫుచేసి బీదరైతులరక్షించెదరు గాక.

---

## ఆర్యప్రచారము

(స్వ. వి.)

కరీంనగరము, ౧౬-౩-౫౦ ఫ.

కరీంనగరముజిల్లాకొరకు నియమింపబడిన ఆర్యసమాజప్రచారకులగు శ్రీయుత సత్యదేవు సిద్ధాంతరత్న గారు ౧౨-౩-౫౦ నాడు పెద్దపల్లి జాగీరువెళ్లి ఉపన్యాసమిచ్చిరి. శ్రీహనుమాన్ మందిరములో ప్రతిరోజు ౧౫౦ మందివచ్చి తమతమసందేహములను తీసుకొనుచుండిరి. వీరి మృదుమధురభాష్యము గోష్ఠి ఇచటఆర్యసమాజమందిరముస్థాపించుటకు ఉద్యుక్తులైన ప్రజలకధిక ప్రశంసనీయులు పెద్దపల్లినుంచి సుల్తానాబాదువచ్చి శ్రీ సత్యదేవుగారు రెండురోజులుండిరి. హరిజనులఇండ్లలోకిపోయి వారికష్టనిష్ఠురములను తెలిసికొని వారికిహితోపదేశముచేసిరి.

కరీంనగరపు ఇతరతాలూకాలలోనికి, ముఖ్యగ్రామాదులలోనికిపోయి మతప్రచారముచేయుచున్నారు.

---

## అఖిలభారత ఆయుర్వేద విద్యాపీఠ భిషక్పరీక్షలు

౨౨-౧౨-౪౦

“నిజాంరాష్ట్ర ఆంధ్ర ఆయుర్వేద కళాశాల” నైజాంరాష్ట్రమునకు కేంద్రముగా యేర్పరచి అఖిల భారత ఆంధ్రవిద్యాపీఠపరీక్షలు రెండుసంవత్సరములనుంచి జరుపబడుచున్నవి. భిషక్ పరీక్షార్థులు ఈ డిశంబరునెల ౩౧వతేదివరకు పరీక్షాశుల్కమునకట్టి దరఖాస్తులుపంపవలయును. యిదివరకు కొన్నివిషయములందుమాత్రము ఉత్తీర్ణతచెందిన పాతపరీక్షార్థులు యీసంవత్సరము పరీక్షలకురానిచో ముందుసంవత్సరమునకు వీరి క్రొత్తవిషయము అంగీకరింపబడవు. క్రొత్తగాయీసంవత్సరముపరీక్షలకొచ్చు విద్యార్థులు రు౫-౦-౦ లు కల్దారు పరీక్షాశుల్కము కట్టవలయును అభ్యసించినయెడల ౧౯౪౧ జనవరిమాసాంతముకు యింకొకరూపాయి అధికముగాకట్టవలయును. యింకనుకావలసిన యితరవిషయములను దిగువ ఆశ్రమములో తెలుసుకొనవలయును.

పండిత రామానుజస్వామి
ప్రధానోపాధ్యాయుడు
నిజాంరాష్ట్ర ఆంధ్ర ఆయుర్వేద కళాశాల,
హైదరాబాద్-(దక్కన్)

---

గోలకొండపత్రిక

విక్రమనామసం॥రమార్గశిర బ॥ ౧౨

గురువారము

# స్నాతకోపదేశము

ఈ కాలములో భారతదేశమందలి విద్యాపీఠాలలో ఏటేట బి. ఏ., ఎం. ఏ., డాక్టర్, సైన్సు మున్నగు డిగ్రీలను(సాహిత్యబిరుదులను) పొందువారికి ఒక పెద్దమనిషి వచ్చి నీతులుబోధించుట వాడుకయైయున్నది. ఈ ౬౦ ఏండ్లనుండి యిట్టి యుపన్యాసాలు వేలసంఖ్యవరకు పెరిగిపోయినవి. ఈ ఆచారము పాశ్చాత్యులు (ఇంగ్లీషువారు) తెచ్చిపెట్టిన యాచారమని చాలామంది అభిప్రాయ పడుచున్నారు. ఈ యాచారాన్ని హిందువులనుండియే ఏనాడో పాశ్చాత్యులు స్వీకరించిరి. ఇంగ్లీషులో ఎవ్వరిని గ్రాజుయేట్లు అనియందురో మన ప్రాచీనులు పూర్వకాలంలో అట్టివారికే అనగా సాహిత్యముతో పాటుగా ఒక శాస్త్రాన్ని క్షుణ్ణంగా అధ్యయనించి పరిణతిపొందిన వారికి "స్నాతకులు" అని పేరుబెట్టిరి. అయితే ఆ స్నాతకులకున్ను మన గ్రాజుయేట్లకున్ను ఉత్తర దక్షిణ ధ్రువాల భేదమున్నది. స్నాతకులు బ్రహ్మచారులుగా నుండుట విధిగానుండెను. భారతీయ గ్రాజుయేట్లలో ఇంచుమించు మూడవ వంతుమంది వరకు వివాహితులో, లేక శిశువుల తండ్రులో, లేక బ్రహ్మచర్య వ్యతిరిక్తులో అయియుందురు. ప్రాచీన స్నాతకులకు ఒక శాస్త్రమందు పారమందిన ప్రవేశముండెడిది. ఇప్పుడు నూటికి ఠంగునా (మార్కులతో) పారమందినట్లే! ఆ కాలంలో నిస్నాతకులకు సిగరెట్లు దుకాణాలు లేకుండెను. "పాకబీడాలు", "కారాకిల్లీలు, "చా" కాఫీ"ల హోటల్లు లేకుండెను. వారు మాధుకరులు. గురుశిష్యులకు జనకజన్య సంబంధముండెడది. అది మోటుకాలపుమాట. ఇప్పుడో శిష్యులపై 'మోటార్లను తోలును గురువులు దొరుకుదురు. గురువులను లేవడిపట్టించు శిష్యులు బహుళంగా నున్నారు. ఆనాటి శిష్యులకు ఉల్లి, ఎల్లి, తాంబూలము, దుంపలు, మాంసము, మొక్కలు, సు. నవ ద్రవ్యాలు, గంధానుమాల్యాలు—అనగా కామాదులను, మనమును, భోగలాలసతను పెంపొందించు భోజనభాజనవస్తువులు విధిగా వర్జములైయుండెను. బ్రాహ్మీముహూర్తమందు వారులేచుచుండిరి. ఇప్పుడంతయు తలక్రిందు వ్యవహారమే.

ప్రాచీనములో కనిష్ఠము ౨౪వ సంవత్సరము వయస్సువరకు విద్యార్థులు బ్రహ్మచారులై గురుకులమందు వాసముచేసి భక్తితో గురుసేవచేసి విద్యాపరిసమాప్తి నొందిన తర్వాత వారికి గురువు ఉపదేశము చేయుచుండెను. దానినే మనపెద్దలు స్నాతకోపన్యాసమనిరి. ఈ విధంగా ఉపన్యాసాలు చేసినట్లు ధర్మశాస్త్రాలలోనేకాక పురాణాదులలోను, కథలలోను మనకు నిదర్శనాలు కనబడుచున్నవి. కాదంబరీ కావ్యములో ఇట్టి యుపదేశమొకటి సుప్రసిద్ధమైనదైయున్నది. అది సంస్కృత వాఙ్మయములోనే మణివంటి ఘట్టము.

ఈ కాలములో ఎన్నియో విద్యాపీఠాలలో ఏటేటనుగూడ విద్యాపాండిత్యప్రకర్షమందు ప్రఖ్యాతులైనవారు ఆంగ్లవిద్యా స్నాతకులకు ఉపదేశాలు చేయుచున్నారుకాని భారతదేశానికి చారిత్రికముగాను దాని వాతావరణానికి తగినట్టుగాను ప్రాచీనపద్ధతి నెంతవరకు ఇప్పటి కాలానికవసరమగు మార్పులతో ఏవిధంగా ప్రవేశపెట్టవలెనో అనుచ్చుట చెప్పనే చెప్పరు. ఎంతసేపటికినీ యూరపు అమెరికాదికేక చూచుచు మాట్లాడుచుందురు. ఇటీవల మరొక పద్ధతికూడా అవలంబింపబడుచున్నది. తమ స్నాతకోపన్యాసములో రాజకీయాలనుగూడా కలిపి శాఖా చంక్రమణము చేయుట పరిపాటియై పోయినది.

మొన్న ఉస్మానియా విద్యాపీఠములోని స్నాతకులకు సర్ మారిస్ గ్వైయర్ గారు ఉపదేశమును వినిపించినారు. అదిచాలా దీర్ఘంగానున్నది. విషయమాతత్త్వాలతో నిండినది. పైగా ఆధునిక రాజకీయ సమస్యలను విడదీసేదానికి కొత్త చిక్కులనుకూడా చూపించివెళ్లిపోయినారు. వారి రాజకీయనిమాలోచనలతో మేము విశేషముగా భిన్నించుచున్నాము. దాని చర్చ ఇప్పుడు మాకవసరంలేదు.

"కొన్ని సందర్భాలలో సర్కారీ గుమాస్తాలను సిద్ధముచేయుటకై యీ భారతీయ విద్యాపీఠములు స్థాపింపబడినవని అదిలో కొందరు ఆక్షేపణము చేసేవారు" అని సర్ గ్వైయర్ గారు సెలవిచ్చినారు. అయితే ఇప్పటికిన్నీ అమాటసత్యమే. సర్ వీ. సీ. రాయిగారు ఒకతడవ యిచ్చిన స్నాతకోపన్యాసంలో ఈనాటి గ్రాజుయేట్ల మార్కెటు విలువ ౨౫ రూపాయలనిన్నీ మద్రాసీలు సాంబారు రసం త్రాగుకునేవారుకాబట్టి వారి విలువ మరీతక్కువై ౨౦ రూపాయలవరకే అనిన్నీ సెలవిచ్చియుండిరి. గ్రాజుయేట్లయిన వారందరును ఉద్యోగాలకు ప్రాకులాడుదురు. ఇతరదేశాలలో సైన్సును దేశసేవలోకి తెత్తురు. మనదేశ స్నాతకులు గుమాస్తాగిరీకే దానిని యోగించుచున్నారు.

విద్యాపీఠమంటే ప్రజలు విద్య నేర్చుకొనుటయేగాక ఆత్మబోధనుకూడా పొందుస్థలమని గ్వైయర్ గారు నిర్వచించినారు. ఇది సరియైనమాట. ఈ ఆత్మబోధ పిల్లలలోను పంతుళ్ళలోను ఎప్పుడు తక్కువగునో అప్పుడే సమ్మెలు, అల్లరులు, అసహనము పొంగివచ్చును.

"ఉన్నతవిద్యకు ఉన్నతసౌధాలు అవసరంలేదు. గుడిసెలలో నుండి ప్రపంచగురువులు బయలుదేరినారు" అనే అభిప్రాయాన్ని సర్ మారిస్ గారు ప్రకటించినారు. ఇది భావగర్భితమైనది. చాల విలువగలమాట. ప్రాచీనార్య లో ఈ పద్ధతియే యుండినది. అడవులలోను, కుటీరాలలోను, ఆశ్రమాలు స్థాపించి పూర్వపు ఋషులు, మునులు అత్యుత్తమ విద్యాప్రచారము ఉచితముగా ప్రతిఫలరహితముగా చేసిరి. మరిఇప్పటి సంగతివర్ణించ వలసిన పనియేలేదు.

సర్ మారిస్ గారి ఉపన్యాసము చాలా గంభీరంగా ఉన్నది. ఇంకనువారి యుపన్యాసములో చర్చనీయాంశాలు కొన్ని యున్నను ఇప్పుడవి చర్చించుటకు వీలులేదు.

## నీటిగొట్టాలపన్ను

హైద్రాబాదునగరములో త్రాగుడునీటికొలతకు (మీటర్ ఏర్పాటుచేయకూడదని నగరపౌరులు పౌరవిజ్ఞప్తిని (మెహజర్ను) పంపుకొనుచున్నారు శ్రీమన్ మ.ఘ.వ. నిజాంప్రభువుగారు లక్షల లక్షలవ్యయముకాని చెరువులు నిర్మించగా త్రాగుడునీటిపై పన్నువిధించుట వారిఅభిప్రాయముకాకేరదు, ఈపన్నులలోను న్యాయములేదు పెద్దపెద్దవారియిండ్లలో పాయిఖానాలకునీళ్ళు ఒక్కొక్కయింట్లో దినమున్నూ పీపాలకొద్ది ఖర్చగుచున్నవి. బేగంపేట, పలకపేట, చిలకల్ గూడా, బంజారగుట్టవంటి పెద్దపెద్ద ఎత్తుస్థలాలలోని అధికారులు ధనికులు తమతోటలకు ౨౪ గంటలు ఏకధాటిగా నీరుపారించుచుందురు వారికేమీమీటరులేదు, గీటరులేదు. మరేదియా నుమాయించేస్తామని స్థ్యాయనివారు ఉన్నశాఖలనుకూడా పూడ్చించినారు. మరియిప్పుడు మీటర్లఆవశ్యకమెందుకు పెట్టుచున్నారు. ఈవిధంగానైతే ప్రవర్తి ఒకమెహజరుపైహిందూముసల్మానులు పలువురుసంతకంచేసి ప్రమరణార్థంమాకొక్కప్రతినిపంపినారు.

## హైద్రాబాదు శాసనసభ

మూడ్వాళ్ళతర్వాత హైద్రాబాదు శాసనసభమునకీసెను అందుకొన్ని శాసనాలయ్యే. ఈ క్రిందివి ఉపసంఘమువారికి పంపబడెను.

[౧] భగేలాశాసనములో మార్పులు

[౨] కౌలుదారుల హక్కులు.

ఇది చాలాముఖ్యమైనది. బొంబాయిలో ఇట్టిదిచేసియుండిరి. ఇంచుమించు అజాడలోనే ఉన్నది. కొన్ని యేండ్లనుండి క్రమంగా కౌలుదారులుగా విధూమినైనా వీస్తుచేస్తే ఆట్టివారిని విడిపించేదానికిపట్టాదారుకు ఇకముందు హక్కుండదు ఈ శాసనం ముందుసంవత్సరం ప్రవేశపెట్టుటకై తమఅభిప్రాయాన్ని తెలుపుటకై ఒకఉపసంఘాన్ని ఏర్పాటుచేసి దానికళము చేసినారు.

[౩] బిచ్చగాండ్ర నిరోధకశాసనము

## ఆర్. సీ. అయ్యంగారు

జిల్లా పోలీసుశాఖలో ౩౦-౩౨ఏండ్లుగా పనిచేసి తుదకు నాజిరుగారి సహాయాధికారిగా బహుకాలముపనిచేసిన ఆర్. సీ. అయ్యంగారుగారు ఉపకార వేతనముపై ఉద్యోగమునుండి విరమించుకొన్నారు వీరిగౌరవార్థము జిల్లా పోలీసుకచ్చేరీలో ఆటపాటలు, పోలీసు కీడలు వినోదాలు, విందులు చేసిరి

### న్యాయశాఖ మంత్రి

హైదరాబాదు (దక్కన్) బహమన్ ౧౭ గా॥ సయ్యదుఅబ్దులకేజా మంత్రిగారు రేపు మంగళవారమునుండి నల్లగొండ, సూర్యాపేట, మిర్యాలగూడ, హుజూరునగరు, దేవరకొండ, భోనగిరి, జనగామ ప్రాంతాలలో పర్యటనచేయుచున్నారు.

### ధారానాయకుడు

హైదరాబాదు(దక్కన్), బహమన్ ౧౭ హాజరత్ శాహర్ సైఫుద్దీన్ అను ధారాముస్లిం మతగురువుగారు హైద్రాబాదుకు మ.ఘ.వ.నిజాం ప్రభువుగారి ప్రత్యేకాహ్వానముపై విజయంచేసియుండిరి. వారు ఇచ్చటినుండి రేపు మద్రాసుకు వెళ్లుచున్నారు. ఇక్కడఉండిన యీవారందినాలలో వారు నగరంలో ముఖ్యప్రదేశాలనుచూచినారు. మ.ఘ.వ. నిజాంగారిని కలిసి మాట్లాడినారు. గా॥ రెసిడెంటుగారితో కలిసినారు. ప్రధానమంత్రిగారివద్ద చేనీరు పుచ్చుకొన్నారు. మసీదులో ధారాలకు నమాజు అనంతరం ఉపదేశం చేసినారు.

## అఖిల భారత తెనుగు మున్నూరువారి ద్వితీయ మహాసభ నాగపూరు

౨౭-౨౮-౩౦ డిసెంబరు౧౯౪౦ శని. ఆది. సోమవారములలో నాగపురము సీతబుల్డి నారమల్ పాఠశాల ఆవరణయందుశ్రీయుత రాజరత్న బాపన్న బాలాజీ (బరోదనివాసస్థవ్యులు)ఎం.ఏ.ఐ.ఇ.ఇ.ఎం ఇ గారి ఆధిపత్యమున అఖిలభారత తెల్గు మున్నూరువారి ద్వితీయమహాసభ జరుపబడును.

### మందుక్రయమొగబెట్టిన మహానుభావులు

హైదరాబాదు (దక్కన్), బహమన్ ౧౪ హైద్రాబాదు నగరములో జంతుచికిత్సలను చేయించుకొని మందుల క్రయము పంపుతాముతే అని కొందరు పెద్దమనుష్యులు వెళ్లిపోవుటయున్ను. తర్వాత పశుచికిత్సశాలవారు మనుష్యులకు పంపిపంపి వేసారుటయున్నూ తుదకు క్రమం వసూలు కాకపోవుటయున్నూ — ఈ సంగతంతా గమనించి యికముందుకు నిర్ణయమైనదేమంటే మందుక్రయం ముందు దాఖల్ చేస్తేనేకాని చికిత్సకాదు అని ప్రభుత్వం వారు ప్రకటించినారు.

### చీకోటి వీరన్నగారు

సికింద్రాబాదులో ప్రసిద్ధులైన చీకోటివీరన్న అనువారు ౭౦సంవత్సరముల యీడులో ఆదివారమునాడు చనిపోయినారు.

### ఆదిలాబాదు జిల్లా కచేరీలు

హైదరాబాదు(దక్కన్) బహమన్ ౧౯ ఆసీఫాబాదునుండి ఆదిలాబాదుకు జిల్లాకచ్చేరీలు మార్చబడినవి కాని న్యాయస్థానముమాత్రము ఇంకను ఆసీఫాబాదులోనే ఉండగలదని ప్రభుత్వప్రకటన తెలుపుచున్నది

### గుల్బర్గాలో ప్లేగు

హైదరాబాదు(దక్కన్), బహమన్ ౧౯ గుల్బర్గానగరంలో ౧౧ ప్లేగుజాడ్యాలున్ను ౩ చావులున్ను సంభవించినవి. అందుచేత గుల్బర్గాతాలూకాలో ప్లేగువ్యాపించినదని ప్రభుత్వంవారు నిర్ణయించినారు.



## ఫలితం తెలిసిపోయిందిలే

శ్రీమందుముల నరసింగరావుగారు రెండు చిత్తుశాసనాలు హైదరాబాదుశాసనసభలో ప్రవేశపెట్టియుండిరి. అది ౧. హిందూవారసత్వములో స్త్రీలహక్కు-౨ వికలాంగులవారసత్వపుహక్కు. అనునట్టివి, అవి గతవారము చర్చకుతీసుకొనగా నరసింగరావుగారు ఇట్లు ఆక్షేపపూర్వకముగా చెప్పిరి.

"నిన్న టీదినము శాసనసభలో కలిగినవిషమానుభవమునుబట్టి యీనాడు ఈరెండుశాసనాలగతి యేమయ్యేదికూడా నాకు తెలిసిపోయింది. ఈపరిస్థితిలో నాకు వట్టికంఠశోషమాత్రం మిగులుతుంది. అందుచేత ఈసాధింపును మరొకమారు మేలుకాలమువచ్చినపాడు చేయుటకై నాశక్తులను సంరక్షించుకొందును ఈశాసనాలను నేనుప్రవేశపెట్టను ఉపసంహరించుకొనుచున్నాను"

## హైదరాబాదు యుద్ధ విమానాల ఘనకార్యము

### ఒకవంద శత్రు విమానాలను కూల్చుట

హైదరాబాదు సంస్థానప్రభువు మ.ఘ.వ. నిజాంగారును, హైదరాబాదు,సికింద్రాబాదు ప్రజలును బ్రిటిషుప్రభుత్వమునారికి సమర్పించుకొన్నట్టి విమానాలు బ్రిటనురక్షణకార్యములో ఒకవందశత్రువిమానాలనుకూల్చినవి. నిజాంప్రభువుగారి విమానదళము ౨౭విమానాలను పాడుచేసినది, ఈవిమానాలు ఫ్రాన్సులోకూడా గొప్పపనిచేసినవి. ఇవి బ్రిస్టలు, డోర్సెటు, సౌత్‌హాంప్టనుల రక్షణకై పోరాడినప్పటినుండి ఆగస్టు ౧౨ రోజులలో ౨౪ కంటె ఎక్కువవిమానాలను నాశనముచేసినవి. హైదరాబాదు, సికింద్రాబాదుల ప్రజల విమానదళము ఇకరోకైకే రాశి ర్మను విమానాలను క్రిందకూల్చివేసినవి.

### ముదిరాజుసభ

తేది ౧౭ బహమన్ ౧౩౫౦ ఫ శుక్రవారం ౫ గంటలకు హైద్రాబాదు(దక్కన్) నారాయణగూడెంలో డి. బాలక్రిష్ణయ్య ముదిరాజుగారిగృహమందు యం. మైసయ్యగారి అధ్యక్షతలో సైసభసమావేశమయ్యెను అందులో శ్రీయుత కె. కృష్ణస్వామిముదిరాజు బి. వెంకటరాం వకీలు గారు, మరియు డాక్టరువర్త్యనారాయణగారున్ను జాతిసంఘసంస్కరణము ప్రకృతివిరుద్ధమైనఆహారము, మరియు బాలురవిద్యాభివృద్ధి వీటినిగురించి వుపన్యసించిరి మరియు నారాయణగూడెంలో ముదిరాజుమహాసభయొక్క శాఖను నిర్మించిరి.

సంయుక్త రాష్ట్ర-సెంబ్లీడిప్యూటీ. స్పీకరు అబ్దుల్ హకీము గారు డిసంబరు ౧౬ వ తేది ఒక స్త్రీ కోర్టుముగిసేవరకు నిర్బంధశిక్షయు, రూ ౧౫౦ జరిమానాయును, దానిని చెల్లించని యెడల 3 మాసాలవిశేష శిక్షను విధింపబడిరి— శ్రీ గోస్వామి రాధామోహనసింగు యం- యల్- ఏ- గారు ౧౬ వ తేదీ బాల్లియాలో ౧సం. కఠిన శిక్ష విధింపబడిరి— కల్పితుండైవచ్చినవార్తనుబట్టి శ్రీ శత్రుఘ్నసింగు గారికి ౧౮ నెలలకఠినశిక్ష, రూ 3౦౦ జరిమానా దానిని చెల్లించనియెడల మరి ౬ మాసాలశిక్ష విధింపబడ్డట్లు తెలియవచ్చెను— శ్రీ చౌదరిపరగిలాలు యం.యల్-ఏ-గారికి ౧సం. శిక్షైను ఒసగబడెను—

శ్రీ శేశవగుప్తా యం. యల్. ఏ. గారు(ముజఫరపూరు) సత్యాగ్రహం చేసినందుకై అరెస్టు చేయబడిరి.

సంయుక్తరాష్ట్ర ప్రభుత్వ మాజీవిద్యామంత్రి పండితప్యారీలాలశర్మాగారు ౧౭ వ తేది సత్యాగ్రహంచేయనెంచిరి—కాని వారిని ౧౬ వ తేదిన ఉదయమే పోలీసుడిప్యూటీసూపరింటెండెంటు అరెస్టుచేసి జెయిలుకు పిలుచుకొనిపోయిరి.

పండితరామకాంతమాళవ్య యం. యల్. ఏ. (యు. పి) గారికి అలహాబాదులో సిటిమేజిస్ట్రేటు ౧సం॥ విడిశైదు విధించిరి. పండిత రామకాంతమాలవ్యాగారికి (ఏ)క్లాసు యివ్వబడెను.

డిసంబరు ౧౫వ తేదిన అంబాడియాలో సత్యాగ్రహం చేసినందుకు అరెస్టు గావింపబడిన నీలగిరి సంస్థాన ప్రజామండలి కాంగ్రెసు అధ్యక్షుడును, ఏ. ఐ. సి. సి. సభ్యుడునుఅగు శ్రీ కైలాసచంద్రమహంతి గారికి కటకంజిల్లామేజిస్ట్రేటు ౧౬వ తేదిన ౬ నెలల కఠినశిక్షవిధించిరి.

డిసంబరు ౧౬వ తేదిన అభ్యపురిలో సత్యాగ్రహంచేసినందుకు శ్రీ పరమానందదాస్ యం. యల్-ఏ-గారు పోలీసు సూపరింటెండెంటుచే అరెస్టుచేయబడిరి— వారికి ౬ నెలలశిక్షవిధించబడినది.

బర్హాంపూరు మునిసిపాలిటీఅధ్యక్షుడు శ్రీ మజుందారు యం-యల్-ఏ-గారును, మిసెస్ బురూడ్‌గారును సత్యాగ్రహం చేసినందుకై అరెస్టుచేయబడిరి.

శ్రీ యం. బి. నారాయణ్జిగారు (అమరావతి) యుద్ధప్రతికూల కేకలు వేసినందుకు రూ ౨౦౦ జరిమానా విధింపబడిరి.

డా॥ శేషాద్రులాలుకుంరూగారు సత్యాగ్రహం చేసినందుకు ౧ సం॥ శిక్ష విధింపబడిరి

సంయుక్తరాష్ట్ర నిర్మాణశాఖపూర్వ మంత్రి హఫీజుమహమ్మద్ ఇబ్రాహీముగారు డిసంబరు ౧౬వ తేది బిజ్నూరులో అరెస్టు గావింపబడిరి

డిసంబరు ౧౫వ తేదిన అరెస్టుఅయిన లక్నోనగర కాంగ్రెసుకమిటీ అధ్యక్షుడు శ్రీ సి- బి- గుప్తా యం. యల్. ఏ, గారికి ఒకసంవత్సరం విడిశైదువిధింపబడెను, బి. క్లాసులోనుంచబడిరి

తాను సత్యాగ్రహం చేయదలచినట్లు కాశీ జిల్లామేజిస్ట్రేటుకు తెలియపరచిన పండిత గోవింద మాళవ్యా యం. యల్. ఏ. గారు పండిత మదనమోహన మాళవ్యగారి కనిష్ఠపుత్రుడు) దేశరక్షణనిబంధనలక్రింద కాశీలో ౧౫వ తేది మధ్యాహ్నం అరెస్టుచేయబడిరి.

ఒక గ్రామమందు సత్యాగ్రహంచేసిన పండిత రామకుమార్‌శాస్త్రి యం. యల్. ఏ. గారు అరెస్టు చేయబడిరి.

సంయుక్తరాష్ట్ర ప్రభుత్వపార్లమెంటరీ కార్యదర్శి శ్రీ ఆచార్య జుగల్‌కిషోరుగారికి ఒకసంవత్సరం కఠినశిక్షవిధింపబడెను. వారుతాత్కాలికంగా బి. క్లాసులోనుంచబడిరి.

ముజఫర్‌గంజులో సత్యాగ్రహం చేయునట్లు జిల్లామేజిస్ట్రేటుకు ముందుగా తెలిపియుండిన హరిజన యం. యల్. ఏ శ్రీపూరన్‌మసీగారు డిసంబరు ౧౫వ తేదిన అరెస్టుచేయబడి గోరఖ్పూరు జిల్లాజెయిలుకు తీసుకొనిపోబడిరి.

బద్రితాలూకాకు శ్రీ రాజా బజరాంగ్ యం. యల్. ఏ గారు సత్యాగ్రహమొనర్చుటకు వెళ్ళుచుండగా అరెస్టు చేయబడిరి.

శ్రీ చౌదరీ ... యం యల్. ఏ. గారు (బాదాన్) సత్యాగ్రహంచేసినందుకై దేశరక్షణనిబంధనలక్రింద ౧౫వ తేది అరెస్టుచేయబడిరి

డిసంబరు ౧౬. సోమవారంనాడు సత్యాగ్రహంచేసిన ఏ.ఐ.సి.సి. సభ్యుడు శ్రీ ఎస్.బి. పటేలు ఎం ఎల్ ఏ. గారికి ౬ నెలలకఠినశిక్ష, రూ ౫౦౦ జుర్మానా విధించబడెను

నక్ గ్రామములో సత్యాగ్రహం చేసిన బర్డ్సవికి రూ ౫౦ జుర్మానా విధింపబడెను.

...స్రీ భ్యులు శ్రీ రాజకిషోరుసింగు, శ్రీ యసుబన్షు సాహేబు గార్లకు చెరిఒకసంవత్సరం విడిశైదు విధింపబడెను. ఇద్దరు "ఏ" క్లాసులో నుంచబడిరి.

రసాము యం. యల్.-ఏ, శ్రీ మోహచంద్రబోరా గారికి జిల్లామేజిస్ట్రేటుచే ౬ నెలల విడిశైదు విధింపబడెను, (బి) తరగతి సిఫార్సుచేయబడెను—

సేలంజిల్లాబోర్డు అధ్యక్షుడు శ్రీ కే-యం-నాచిముత్తుగౌండరు, యం యల్. ఏ గారు తాము ౧గలంలో యుద్ధప్రతికూల వాదమును ప్రసంగించినందుకు ౧౬ వ తేదిన అరెస్టుచేయబడిరి—శంకరిసబ్‌డివిజనలు మేజిస్ట్రేటు శ్రీ గౌండరు గారికి దేశరక్షణనిబంధనలక్రింద ౬ నెలల కఠినశిక్షవిధించి బి-తరగతియొసగిరి.

శ్రీ హెచ్-కే-శఠకోప మొదల్యారు యం యల్ సి, (సేలం) గారు యుద్ధప్రతికూల కరపత్రములను సేలంవిక్టోరియామార్కెటులోపంచి సత్యాగ్రహంచేసినందుకు అరెస్టుచేయబడిరి-సేలం సబ్‌డివిజనలు మేజిస్ట్రేటు శ్రీ మొదల్యారు గారికి ౬ నెలల విడిశైదునొసగి (ఏ)తరగతిలోనుంచిరి-

కృష్ణగిరిలో తనయింటిముందర యుద్ధప్రతికూల వాఙ్మయాన్ని పంచి సత్యాగ్రహంచేసిన శ్రీ పి-టి-వెంకటాచారి యం,యల్,ఏ గారు దేశరక్షణ నిబంధనలక్రింద అరెస్టుచేయబడిరి.

తంజావూరు సబ్‌డివిజనలు మేజిస్ట్రేటు ఖానుగారు శ్రీ నాడిముత్తుపిళ్ళె యం,యల్,ఏ, గారికి ౪ నెలలవిడిశైదు, రూ ౫౦౦ జరిమానా దానిని చెల్లించనియెడల మరిరెండునెలల శిక్షవిధించిరి- శ్రీ పిళ్ళెగారికి ఏ-తరగతియొసగబడెను—

అఖిలభారత కార్మికమహాసభ అధ్యక్షులు డా॥ సురేశచంద్రబెనర్జీ ఎం ఎల్. ఏ, గారు ఇదివరకు సత్యాగ్రహం చేయగా అరెస్టుచేయబడనందున డిసంబరు ౧౫ వ తేది మరల వేరొకచోట సత్యాగ్రహముచేసిరి

నౌకాలియందు కాంగ్రెసుకార్యాలయంవద్ద సత్యాగ్రహంచేసిన హరీంద్రకుమారసూరు, (ఎం ఎల్ ఏ) గారు ఇదేరోజు అరెస్టుచేయబడిరి. ఇదేరోజు సుకుమారదత్త ఎం.ఎల్,ఏ గారుచ పదంగయందు కేడుఅరెస్టుచేయబడిరి.

లాలా దునిచందు గారు నేడుసాయంకాలం రెండవసారి గాంధిగారినిచూచిరి. పంజాబుసత్యాగ్రహులజాబితాను గాంధిమహాత్ముడు ఆమోదించెను. ౩౦ మంది శాసనసభ్యులు. ౧౫ మంది ప్రచారకులు జెయిలుకుపోవ ఆమోదమును బడలిరని లాలాదునిచందు గారు పంజాబునకు వెడలిపోవుచు తెలిపిరి. పంజాబులో సత్యాగ్రహమునకు ఆక్షేపణయేమిలేదని గాంధిగారు తెలిపిరని వదిరి.

భగవంతరావు మండీలాయి యం యల్.ఏ.గారు, గులాబుచందుచౌదరి యం,యల్.ఏ. గారు ఆరునెలలు కఠినశిక్షవిధించబడిరి,చతుర్భుజ జసాని యం.యల్.ఏ గారు పండిత్ నెర్బుదప్రసాద మిశ్ర యం యల్.ఏ,గార్లు అరెస్టుచేయబడిరి,

అగ్రాజిల్లాకాంగ్రెసు సంఘాధ్యక్షులగు సేటు అచలసింగుగారు, ౧౪ వ తేదిన యింటివద్దనే అరెస్టుచేయబడిరి సి.బి గుప్త ఎం,ఎల్,ఏ. గారు గూడ అహ్లైలక్నోలో కాంగ్రెసుమందిరంవద్ద అరెస్టుచేయబడి జెయిలులోనుంచబడిరి.శాసనసభ్యులనల్గురు ౧౫ వ తేది వారివారిపూర్లలో అరెస్టుచేయబడిరి. పార్లమెంటరీ కార్యదర్శులగు శ్రీకోరుగారు పండిత ద్వారకప్రసాదుగారు, లక్ష్మీశంకరు బాజపాయిగార్లు శిక్షింపబడిరి. పండిత వెంకటేశనారాయణ తెవారిగారు (అసెంబ్లీచీఫ్‌విప్), హరినాథశాస్త్రి ఎం ఎల్.సి.గార్లు కూడా వారిపూర్లలో అరెస్టుచేయబడిరి.

డిసంబరు౧౫వ తేది సత్యాగ్రహం చేయునట్లు జలంధర్‌జిల్లా మేజిస్ట్రేటుకు నోటీసుయిచ్చిన శ్రీ రైజాదాహన్సరాజ యం.యల్.ఏ. (సెంట్రలు) గారిని వారియింటిలో ౧౫ వ తేదిన సాయంకాలం అరెస్టుచేసిరి

శ్రీ రైజాదా హన్సరాజ గారిని అడిషనలు జిల్లా మేజిస్ట్రేటు ఎదుట హాజరుచేయగా మేజిస్ట్రేటు వారిని డిశంబరు ౨౦ తేదీవరకు నిర్బంధంలో నుంచిరి

సేవాగ్రామంలో సింధు చెరుకుపంటల డిపార్టుమెంటుఅధికారి శ్రీ కామత్‌గారు ౧౫వ తేది ఉదయం మగన్వాడివద్ద యుద్ధవ్యతిరేకప్రకటనం చేసినందుకు అరెస్టు చేయబడిరి.

డిసంబరు౧౫ ఆదివారం రసియాపురలో సత్యాగ్రహం చేసినందుకు అరెస్టుచేయబడ్డ శ్రీ లాలా అర్జునసింగ్ హాటే యం యల్.ఏ గారు ౬ నెలలకఠినశిక్ష విధింపబడిరి

అసెంబ్లీసభ్యుల మహంతు లక్ష్మీనారాయణదాస్, శ్రీజమునాలాలుచౌధరీగార్లు సత్యాగ్రహం చేసినందుకై ౧౫వ తేది అరెస్టుచేయబడిరి

జిల్లాకాంగ్రెసుఅధ్యక్షుడు శ్రీ బాలకృష్ణపటేలుగారు నిషేధకరపత్రం పంచినందుకుగాను ఇదే రోజు అరెస్టుచేయబడెను.

శ్రీ లాల అర్జునసింగు ఎం. ఎల్. ఏ. గారు హోషంగబాదులోను శ్రీ మహేశ్వరీప్రసాద్ మిశ్రా గారు (ఏ ఐ, సి, సి,) సభ్యుడు హర్దాలోను అరెస్టు చేయబడిరి.

వారసోని సమీపంలో సత్యాగ్రహం చేసినందుకై అరెస్టుచేయబడిన శ్రీ సేట్ బద్రినారాయణ, యం, యల్, ఏ, గారికి ౬ నెలల కఠిన శిక్షవిధింపబడెను బి, క్లాసు యివ్వబడెను,

శ్రీ నారాయణరావు బాలాజీపటేల్, యం యల్, ఏ, గారు యుద్ధవ్యతిరేక కేకలువేసిన సత్యాగ్రహమొనర్చినందుకు ౧౬ తేది అరెస్టుచేయబడిరి,

సంయుక్తరాష్ట్రంలో సత్యాగ్రహంచేసినందుకై యీవారంలో అరెస్టుచేయబడ్డ ఆర్యపార్లమెంటరీ సెక్రటరీ సుశేమాన్ అన్సారిగారికేసు విచారణ గోరఖ్పూరు జిల్లాజెయిలులో శుక్రవారం జరిగెను. గోరఖ్పూరు మేజిస్ట్రేటు అన్సారిగారికి 3 నెలలు శిక్షవిధించిరి- 'బి' క్లాసులో నుంచబడునట్లు సిఫార్సుచేసిరి.

బెంగాలు రాష్ట్రంలో శాల్కురిబాగర్ లో ౧౬ వ తేదిన యుద్ధవ్యతిరేక ఉపన్యాసము చేసినందుకు అరెస్టుచేయబడ్డ శ్రీ గౌరీకాంత తాలూక్దారు యం యల్.ఏ గారు గౌహతి జెయిలుకు తేబడిరి. దేశరక్షణ నిబంధనక్రింద వారికి ౬ నెలల విడిశైదు యివ్వబడెను 'ఏ' క్లాసు సిఫార్సుచేయబడెను

డిసంబరు ౧౪ నాడు సత్యాగ్రహం చేసినందుకు అరెస్టయిన శ్రీ ప్యారీశంకరాయి యం. యల్. ఏ. గారు టౌను మేజిస్ట్రేటుచే ౬ నెలలవిడిశైదు, రూ ౧౦౦ లు జుర్మానా దానిని చెల్లించనియెడల మరి ౪ నెలలశిక్షవిధించబడిరి. బి. తరగతి యివ్వబడెను.

—

